# జమీన్ రైతు

ESTD. 1930
Regd No. H. NL.18
సంపుటి: 61 సంచిక: 7
16-2-1990
నెల్లూరు
శుక్రవారం
12 పేజీలు రూ 1.50

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు • సంపాదకుడు: నెల్లూరు శోభేంద్రప్రసాద్ • మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి


# అర్జునరావు ఉచ్చులో చిక్కిన కోనేరు!

రాష్ట్ర గృహనిర్మాణ మంత్రి శ్రీ కోనేరు రంగారావు, ఆ శాఖ మాజీ కార్యదర్శి శ్రీ అర్జునరావు బిగించిన ఉచ్చులో చిక్కుకపోయాడు. కోనేరు రంగారావు, అర్జునరావులిద్దరూ హరిజనులే; కాకుం వ్యత్యాసం వుంది. ఇద్దరూ కృష్ణాజిల్లాకు చెందినవారు. స్థానికంగా ఇద్దరిమధ్య గతంలో అభిప్రాయభేదాలున్నాయి. రంగారావు గృహనిర్మాణ మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసినతర్వాత, సాంప్రదాయానుసారం తన శాఖ కార్యదర్శి అయిన శ్రీ అర్జునరావు తనను వచ్చి కలువలేదని, మర్యాద చూపలేదని రంగారావు కినుక వహించాడు. ముఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డికి ఈ విషయమై ఫిర్యాదు చేయడంతో, మంత్రులకు స్వేచ్ఛ నివ్వాలన్న తన విధానం అనుసరించి, తక్షణం అర్జునరావును బదిలీ చేశాడు.

అర్జునరావు సమర్థుడైన, వ్యక్తిత్వం కల్గిన అధికారి. స్వతంత్ర వైఖరితో వ్యవహరించడం ఆయన నైజం. అధికారిక కార్యకలాపాల నిర్వహణలోకూడా సాహసోపేతమైన నిర్ణయాలు తీసుకుంటారని ఆయనకు పేరు. తనపై ఫిర్యాదుచేసి, బదిలీచేయించడం ఆయన మనసుకు కష్టం కల్గించినట్లుంది. ఈ దశలో, ఇళ్ళస్థలాలకు సంబంధించిన 33 ఫైళ్ళు ఎన్టీఆర్ ఇంటినుంచి, సెక్రటేరియట్‌కు చేరాయి. తెలుగుదేశం ప్రభుత్వంలో మంత్రులు ఈ ఫైళ్లను ముఖ్యమంత్రికి పంపేవారు. విశ్వామిత్ర పుణ్యమాఅని వాటిపై దారం విప్పే తీరికకూడా ఎన్టీఆర్‌కు లేకుండా పోయింది. కాంగ్రెస్ ప్రభుత్వం వచ్చిన తర్వాత ఆఫీస్‌నుంచి 'లారీ'లో తరలించిన ఫైళ్ళ గుట్టలోనివే ఇవి.

ఇవన్నీ సంపన్నులకు సంబంధించిన ఫైళ్ళు. చెన్నారెడ్డిగారు, ఏ వర్గాలకు సంబంధించిన ఫైళ్ళు, ఆ శాఖ మంత్రులే చూడాలని ఆదేశించడంతో, ఇళ్ళస్థలాల కుబేరుల పంట పండింది. వారందరూ కోనేరు రంగారావును ఆశ్రయించారు. దక్షిణ సమర్పణలూ కాలేగానే జరిగాయని వదంతి. మంత్రి అప్పుడప్పుడు ఆఫైళ్లపై స్వంతబుద్ధితో అనుకూలంగా ఉత్తర్వులు చేశాడు. ఆ హడావుడిలో ముఖ్యమంత్రి స్థాయిలో పరిష్కారం కావలసిన ఫైళ్ళను సైతం. అధికార్లు సిఎంకు మార్కుచేస్తూ వ్రాసిన నోట్‌ను కొట్టివేసి, తానే సంతకాలు పెట్టాడు.

-కొరవ 7వ పేజీలో


కార్యదర్శి సి. అర్జునరావు


మంత్రి రంగారావు

## శ్వేతజాతి గుండెలు ధిగ్గురన....

దక్షిణాఫ్రికా నల్లజాతి ప్రజల ఆరాధ్య దైవం నెల్సన్ మండేలా 11తేదీ జైలునుంచి జనంలోకి వచ్చాడు. 27 సంవత్సరాల 7 నెలల సుదీర్ఘ కాలం నాలుగు గోడల మధ్య మగ్గిపోయినా ఆయనలో సమరోత్సాహం తగ్గలేదు, ఆయనపట్ల ప్రజలలో ఆరాధన సడలలేదు. జైలుగదిలో వుండి శ్వేతజాతి దురహంకారుల గుండెల్లో నిద్రపోయిన 72 ఏళ్ళ వృద్ధసింహం, వారి గుండెలు ధిగ్గురనేలా స్వాతంత్ర్యోద్యమానికి స్వయంగా నాయకత్వం వహించారు.

## రాజధాని రాజకీయాలు
మా ప్రత్యేక విలేఖరి

# జమీన్ రైతు

## దేశానికి చేటు

దేశం ప్రమాదంలో పడిపోయింది. లోపలనుంచి, వెలుపల నుంచికూడా ఒక పథకం ప్రకారం భారతజాతి ఐక్యతను, సమగ్రతను విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. పరమత సహనానికి, పరస్పర సామరస్య సహజీవనానికి వెయ్యేళ్లుగా పేరు పొందిన ఈ పుణ్యభూమిలో మతంపేరుతో చిచ్చు రగిలించి, వినాశనం సృష్టించడానికి పెద్దఎత్తున కుట్రలు జరుగుతున్నాయి.

అంతర్గతంగా రామజన్మభూమి, పంజాబ్ కల్లోలం; బహిర్గతంగా కాశ్మీర్ సమస్య, పాకిస్తాన్ కవ్వింపులు; తెలిసీతెలియని మూర్ఖత్వంతో, అజ్ఞానంతో ఉపప్రధాని శ్రీ దేవీలాల్ ప్రేలుతున్న ప్రేలాపనలు దేశ భవిష్యత్‌ను అంధకారబంధురం చేస్తున్నాయి. కాశ్మీర్‌లో జరుగుతున్నదేమిటి? మతోన్మాదపు విచ్ఛిన్నకత్తులు దూస్తున్నది దేనికి? పాకిస్తాన్‌కు భారతదేశంపై కాలుదువ్వే ధైర్యం ఎక్కడినుంచివచ్చింది? అంతర్జాతీయంగాకూడా ముస్లిందేశాలు కాశ్మీర్ తీవ్రవాదులను బహిరంగంగా బలపర్చే సాహసం ఎందుకు చేస్తున్నారు?

అనేకానేక రాజకీయ, ఆర్థిక సమస్యలతో అల్లకల్లోలంగావున్న దేశ పరిస్థితులను చక్కదిద్దుకునే చేవలేక, చేతకాక పాకిస్తాన్ నేతలు తమ ప్రజలదృష్టి మళ్లించడానికి భారత్‌తో యుద్ధం ప్రస్తావన తెస్తున్నారు; రెచ్చగొడుతున్నారు; పిచ్చి ప్రకటనలు చేస్తున్నారు; విషప్రచారానికి పాల్పడుతున్నారు; తమ స్వప్రయోజనాల కోసం వారు కాశ్మీర్‌లో మారణహోమం సృష్టించ తలపెడుతున్నారు. తీవ్రవాదులకు ఆయుధాలు అందించడంలో, సరిహద్దులు దాటించడంలో, శిక్షణనివ్వడంలో, తమ పాత్రను, ప్రమేయాన్ని పాకిస్తాన్ నేతలు దాచిపెట్టుకోవడంలేదు. కాశ్మీర్‌ను పాలస్తీనా తరహా గెరిల్లా యుద్ధభూమిగా మార్చడంకోసం మనదేశంలోని మతోన్మాదులను కీలుబొమ్మలుగా వాడుకుంటున్నారు!

ఈరోజు కాశ్మీర్‌లో, సరిహద్దులలో నెలకొనివున్న పరిస్థితిచూస్తుంటే ఆందోళన కల్గుతున్నది. ఏ క్షణంలోనైనా యుద్ధమనే అగ్నిపర్వతం బ్రద్దలై దేశాన్ని కల్లోలభరితం చేయగలదన్న భయాందోళనలు కల్గుతున్నాయి. దేశమాత పరువుప్రతిష్టలు కాపాడుకోవడంకోసం యుద్ధానికైనా, ఎటువంటిత్యాగానికైనా భారతజాతి సిద్ధ కాక తప్పకపోయినా- తదనంతర పరిణామాలే భయానకంగా కన్పిస్తున్నాయి. ఒకటికి మూడుసార్లు సాహసోపేతమైన భారతసైన్యం చేతిలో చావుదెబ్బతిన్న పాకిస్తాన్ మళ్ళీ తన దురాలోచనలకు పాల్పడుతున్నదంటే- అందుకు కారణం, ఢిల్లీలోని రాజకీయ నాయకత్వం బలహీనమైనదనే భావన కల్గడం వల్లనే! భారత ప్రతిపక్షాలపట్ల బయటి దేశాలలోవున్న చులకన భావమే వారినీ దుస్సాహసానికి పురికొల్పుతున్నది. వి పి సింగ్ ప్రభుత్వానికి ఇదొక సవాల్ వంటిది. స్పష్టమైన, సందేహానికి తావులేని, సాహసంతోకూడిన రాజకీయనిర్ణయాలద్వారా ఆయన పాకిస్థాన్‌ను నివారించగల్గాలి; ప్రభుత్వాలు మారినా భారతజాతి, భారతీయసైన్యం ఆత్మస్థైర్యం మొక్కవోనిదని వారికి ఎరుకపరచాలి!

దేశం వెలుపలి ప్రమాదం కాశ్మీర్ సమస్య అయితే, లోపలి ప్రమాదం రామజన్మభూమి. సున్నితమైన ఈ సమస్యను ప్రేరేపించి, ఉద్రిక్తతలు రెచ్చగొట్టి రాజకీయ లబ్ధిపొందడానికి బి. జె. పి. చేస్తున్న కుటిలయత్నాలు దేశానికి చేటుతెస్తున్నాయి. విశ్వహిందూపరిషత్ ఆ పార్టీ చేతిలో కీలుబొమ్మ అనేది జగమెరిగిన రహస్యం. పార్లమెంట్ ఎన్నికలకు ముందు వారొకసారి ఈ వివాదాన్ని లేవనెత్తారు; హిందూ మతోన్మాదులను రెచ్చగొట్టారు; రెండు సీట్లుగావున్న తమబలాన్ని 80 కి పెంచుకున్నారు; శాసనసభ ఎన్నికల సమయంలోనూ అదేతంతు; అదేపన్నాగం. లేకుంటే ఆలయ నిర్మాణం జరిగితీరుతుందని ప్రకటించి, ప్రభుత్వ విన్నపాన్ని పెడచెవిన పెట్టినట్లు నటించి, ఉద్రిక్తతలు పెరిగినతర్వాత నాలుగునెలలు వాయిదా వేసుకోవడమేమిటి? ఎన్నికలకవసరమైన భావోద్రేకాలు పెరిగినంతవరకు నాటకాలాడారు వారు. ఎంత నీచమైనపనిఇది?

400 సంవత్సరాలుగా అక్కడ రామాలయం లేనందువల్ల హిందూమతానికి నష్టం ఏమీజరగలేదు. ఇకముందూ జరగదు. వివాదాస్పద స్థలంలోనే గుడికట్టాలనేపంతం రాముడిపై భక్తితో పడుతున్నది కాదు; రాజకీయలబ్ధికై పడుతున్న తాపత్రయం! కాని తత్ఫలితంగా దేశమంతటా ప్రజల మనసులు ఎంతగా కలుషితమైపోతాయో, పరమత సహనానికి ఎంతటి విపత్తు వాటిల్లుతుందో, సామాజిక సహజీవనం ఎంతటి కల్లోలానికి లోనౌతుందో వారికి పట్టడంలేదు. రాజకీయ మతోన్మాదులను ప్రజలు ఎంత త్వరగా అదుపుచేయగల్గితే దేశానికి అంత క్షేమం.

---

## జమీన్ రైతు

16-2-1940

16 పేజీలు అణా

## 50 ఏళ్ల క్రితం ఈ వారం

### బ్యాంకి దావా

నెల్లూరు బ్యాంకు ఇ సి మెంబరైన బి. సుబ్బరామానాయుడు (అల్లూరు) గారిని ప్రాథమిక సంఘంలో సభ్యులుగా తొలగించినా ఇ సి. మెంబరుగా ఎన్నుకొన్నారు. కావున ఇది రద్దు చేయమని సివిల్‌కోర్టులో దావావేశారట.

### సి. రాజగోపాలాచారిగారిరాక

ప్రధానమంత్రిగా యుండిన సి. రాజగోపాలాచారిగారు 17 తేది ఎక్స్‌ప్రెస్‌లో నాయుడుపేట వత్తురు. మధ్యాహ్నం వుదూరులో అల్లాడి కృష్ణస్వామయ్యగారి అతిథిగా నుందురు. అల్లాడి కృష్ణస్వామయ్యగారి చేత నాయుడుపేట ఆసుపత్రిలో కట్టించబడిన వార్డుకు ప్రారంభోత్సవం చేతురు.

### రైతుబిడ్డ నిషేధము

సారథిఫిలిమ్స్‌వారి రైతుబిడ్డ ఫిలిం వెంకటగిరి టవుణులోనేకాదు, గూడూరు డివిజనులో గూడా వేయకూడదని, సినిమెటోగ్రాఫు చట్టప్రకారం నెల్లూరు జిల్లా మేజిస్ట్రేటుగారు నిషేధ ఉత్తరువిచ్చారు. ఇది చాలా అక్రమం.

### వెంకటగిరి జప్తీల ఘోరం

వెంకటగిరి ఎస్టేటువారు అనాదిగా పైర్లు ఎండిపోయినప్పుడు రైతులకు కిస్తులు ముజరాయిచ్చే ఆచారంవద్దు. 1848 ఫసలీలో వెంకటగిరి ఎస్టేటులో దక్షిణప్రాంతం కటికక్షామం. రామ! రామ! రైతులు, కూలీలు పడ్డబాధ అపరిమితం. ఇదిట్లుండగా ఎండిన భూములకు ముజరా యిస్తాము పండిన భూములకు, మెట్టలకు, కిస్తులు పూర్తిగా కట్టించుకొని చెల్లించిన తర్వాత ఎండిపోయిన భూములకుకూడా కిస్తుముజరా యివ్వడములేదు, తేతెమ్మని బాధిస్తారు.

### చిరుతపులితో పోట్లాడుట

నెల్లూరుజిల్లాలో అల్లూరుకు 6 మైళ్ల దూరంలో సముద్రపుటొడ్డున వుండే యిస్కపల్లి అనేగ్రామానికి ఒక చిరుత పులి తప్పించుకొనివచ్చి వూరు వెలుపలి పొదలలో వుండేది. ఇది గ్రామస్తులకు తెలిసి కండిరెడ్డి సుబ్బులు అనే అతని నాయకత్వాన 60 మంది కర్రలతోను, ఈటెలతోను దానిని చంపుటకుపోయిరి. సుబ్బులు ఈటెతో పులిని పొడిచినాడు మిగిలినవారందరును పరుగెత్తిపోయినారు. పోలీసులువెళ్ళి పొదలో పడియున్న పులిని చంపారు. సుబ్బన్న చికిత్సకై నెల్లూరు జిల్లా ఆసుపత్రిలో చేర్చారు. ప్రమాదస్థితిలో వున్నాడు.

---

# విషంతింటే జీవం-ఆహారం తింటే చావు!

సజుగుడు శీర్షికలో అవినీతిపై యుద్ధానికి ఒకసంఘం అన్నవార్త వ్రాస్తూ మీరు చేసిన సలహాలు, సూచనలు మార్గదర్శకంగా వున్నాయి. అవినీతి వ్యవస్థ నిర్మూలనకు రాజకీయపార్టీల అనుబంధ సంస్థలకంటే, కాలేజీ విద్యార్థినీ విద్యార్థులే పూనుకోవాలి. చలనచిత్రాలు, దూరదర్శన్, రేడియో, పత్రికలుకూడా ఈ కృషిలో పాలుపంచుకుంటే ఆశించిన ఫలితాలు సత్వరమే అందుబాటులోకి వస్తాయి.

అలాగే కత్తిరికూడా! పిడపైనసైతం ప్రజలను చైతన్యం చేయాల్సిన అవసరం వుంది. విషంతింటే బ్రతకగల్గి ఆహారం తింటే చావుకుగురయ్యే దౌర్భాగ్యపరిస్థితులు దాపురించవున్నాయి ఇటువంటి సామాజిక దుర్గతులపై, అనాచార నాగతెముళ్ళపై మీ లేఖిని సమరం సాగించాలి.

శ్రీరామమూర్తిగారి పినాకినీతీరం శీర్షికలో రాసేస్తే దాగని సత్యాలు వెక్కు వెలుగుకు నోచుకుంటున్నాయి. ఆ శీర్షికలో చరిత్రకుపయోగపడే వ్యాసాలు గ్రంథస్తమైతే, రాజకీయ నాయకులకు కూడా వుపయోగకరంగా వుంటుంది.

హైదరాబాద్-కంచర్ల విజయభాస్కర్

## జనవాణి

### భారతీయ వైద్యులకు న్యాయం చేయండి!

బిడ్డలను కనడమే తప్ప పోషించడం చేతకాని తల్లిదండ్రులమాదిరి ఆంధ్ర రాష్ట్రాన్ని పాలించిన గత ప్రభుత్వపు అవకతవక నిర్ణయాలలో గ్రామీణ దినసరి వేతన వైద్యుల నియామకం ఒకటి. మండలానికో భారతీయవైద్యుడ్ని నియమించాలనే సంకల్పంతో 1987 లో 450 హోమియో వైద్యశాలలు ప్రారంభించి, డాక్టర్లను నియమించారు. అయితే ఈ నియామకాలకు ప్రభుత్వ నిబంధనలేవీ పాటించలేదు. రిజర్వేషన్లరూలును పట్టించుకోలేదు. సీనియారిటీగాని, ప్రతిభనుగాని అర్హతగా భావించలేదు. పత్రికలలో ప్రకటనా ఇవ్వలేదు. ఎవరు ముందుగా దరఖాస్తుచేస్తే, వారికే ఉద్యోగమని వర్తింపచేసి ప్రాతిపరీక్షకూడాలేకుండా నియామకాలు జరిపారు.

ఈ హడావుడిలో నిజంగా అర్హులైన వారు, పోస్టుగ్రాడ్యుయేట్ డిగ్రీలున్నవారు ఉద్యోగాలు పొందలేకపోయారు. నియామకాలు పొందినవారికి రెగ్యులరైజేషన్ జరగలేదు; శాశ్వతనియామకమూ

—కొరవ 7 వ పేజీలో

# నెల్లూరు రాజకీయాలపై సమగ్ర సిద్ధాంత గ్రంథం

డాక్టర్ ఇన్నయ్య

నెల్లూరుజిల్లా రాజకీయవాదులు అటు స్వాతంత్ర్యోద్యమంలోనూ ఇటు రాష్ట్రోద్యమం లోనూ ప్రముఖపాత్ర వహించారు. కోస్తా ఆంధ్రలో మద్రాసుకు సమీపంగా వుండడంవల్ల నెల్లూరు విద్యావిషయకంగా కొంతవరకు ముందుకు సాగిపోగలిగింది. జిల్లా వహించిన చారిత్రకపాత్రను రాజకీయ విశ్లేషణ చాటిచెప్పవలసివుంది. అందులో భాగంగా నెల్లూరు జిల్లా పార్టీ రాజకీయాలు, ఎన్నికలు, వివిధ వ్యక్తుల పాత్రగురించి ఒక సిద్ధాంత పరిశోధన వెలువడింది.

1957 నుండి 1987 వరకు నెల్లూరు జిల్లాలో పార్టీ రాజకీయాలు, ఎన్నికలు అధ్యయనంచేసిన ఎల్. హెచ్. శ్రీరామ శర్మగారు వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి సమర్పించిన సిద్ధాంతానికి కొన్నాళ్ళ క్రితం పి. హెచ్‌డి. లభించింది.

శర్మగారు యీ సిద్ధాంత గ్రంథంలో 150 పేజీల సుదీర్ఘ రాజకీయ సిద్ధాంతాన్ని వర్ణించారు. రాజకీయాల్ని శాస్త్రీయంగా పరిశీలించేవారికి యీ సిద్ధాంత జ్ఞానం అవసరం. రాజకీయాధికారం, ప్రవర్తన, నాయకులు, వివిధ తీరుతెన్నులు యీ చర్చలో విపులంగా వివరించారు. ఒక విధంగా యిదంతా తన సిద్ధాంత గ్రంథానికి గట్టి పునాదులుగా శర్మగారు వివరించారు.

ఆంధ్ర రాష్ట్రం, తరువాత ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన విధానాన్ని శర్మగారు చర్చించి గ్రంథస్థంచేశారు. రాష్ట్ర రాజకీయాల్ని ఒక క్రమంలో అవగాహనచేసుకో దలచినవారికి భూమిక అవసరం. వివిధ పార్టీలు, ప్రముఖ వ్యక్తులు, వారి పాత్ర, ఎన్నికల తీరు యీ భాగంలో వివరించారు.

నెల్లూరు జిల్లాకు రావడానికి శర్మగారు ఏర్పరచిన భూమిక సమగ్రంగా వుంది. జిల్లా రాజకీయాలు రాష్ట్ర చట్రంలో భాగంగావున్నందున యిలాంటి విపులీకరణ అవసరం.

నెల్లూరుజిల్లాను కళ్ళకుకట్టినట్లు భౌగోళికంగా, ప్రకృతిరీత్యా శర్మగారుచూపారు. వనరులుకూడా పేర్కొన్నారు. ప్రజలు ఎలావున్నారో వివరించారు. రాజకీయాలు ప్రస్తావించటంతోనే ముందు నెల్లూరు జిల్లాను వివిధ కోణాలనుండి శర్మగారు పరిశీలించినందున, మనకు పూర్తి అవగాహన వుంటుందన్నమాట ఇంచు మించు జిల్లాను గురించి ఎలాంటి సందేహాలు లేకుండా పటాన్ని అందించారు. ఇదొక కంప్యూటర్ చిత్రణ. పాఠకులు రాజకీయాల్ని అవగాహన చేసుకోడానికి రంగం సిద్ధమైంది.

నెల్లూరుజిల్లా అనగానే మనకు కొందరు వ్యక్తులు గుర్తుకు వస్తారు. సమకాలీన చరిత్రకు వారుఅవసరం. శర్మగారు ఆ కొరత లేకుండా వివిధ ప్రముఖుల్ని ఇంటర్వ్యూలు చేశారు. వారి జీవితాల్ని పరిశీలించారు. సారంపిండి మనముందుంచారు.

—కొరవ 11 వ పేజీలో

# కళావిహీనమౌతున్న కళాక్షేత్రం

సింహపురి

రావుగోపాలరావు ముత్యాలముగ్గులో సెలవిచ్చినట్లు 'కళాపోసన' చేసే తలంపుతో సర్కారోళ్ళు నిర్మించిన కస్తూరిబా కళాక్షేత్రం కళావిహీనమైపోతున్నది. మామూలు ఆడిటోరియంగా తలపెట్టిన ఈ క్షేత్రాన్ని అప్పటి కలెక్టర్ శ్రీ హెచ్. కె. బాబు దివ్యసుందర దేవేంద్ర భవనం మాదిరి తీర్చిదిద్దారు. పరిస్థితులు అనుకూలించలేదుకాని, ఆయన దాన్ని ఎయిర్ కండిషన్డ్ చేసి, రాజధానిలోని రవీంద్ర భారతికి ధీటుగా తయారు చేయాలను కున్నాడుకూడా!

అయితే ఇప్పుడు కళాక్షేత్రంలో పిచ్చి మొక్కలు మొలుస్తున్నాయి. భవనం ముందుభాగంవరకు ఫర్వాలేదు; వెనుక తట్టు వేదికకు రెండువైపులా పరమ చీదరగావుంది, డ్రైనేజి మ్యాన హోల్ మూతలులేచిపోయి కంపుకొడుతున్నది. అవరణం చిమ్మే నాథుడులేడు. గ్రీన్‌రూంల కిటికీ తలుపులకు గ్లాసులు విరిగిపోయి వున్నాయి ఆ గదులుకూడా బూజుపట్టి భేతాళగృహాలుగా తయారైపోయాయి. అమ్మ అబ్బలేని. ఆలనాపాలనా ఎరుగని అనాథపిల్లలావుంది భవనం.

సర్కారువారి సంబరాలతోతప్ప ఇతరత్రా ఆ కళాక్షేత్రంలో కళా ప్రదర్శన లిచ్చే సాహసం ఎవరూ చేయలేకున్నారు. అందుకు ప్రథమ కారణం భరించలేని బాడుగరేటు అయితే, రెండవ కారణం ప్రేక్షకుల కొరత. ఎంత మంచి నాటకం లేదా డ్యాన్స్ ప్రోగ్రాం పెట్టినా జనం అంత దూరం పోవడానికి ఇష్టపడడం లేదు. ఖాళీ కుర్చీలు వెక్కిరిస్తుంటే ఏ కళాకారుడు తన ప్రతిభా ప్రదర్శనకు సిద్ధపడగలడు చెప్పండి!

ఇంకొకవైపు 'కళ'తో ఏవిధంగానూ సంబంధంలేని సంస్థలకు కళాక్షేత్రంలో ఆశ్రయం కల్పించారు. విజ్ఞాన వేదిక, నెహ్రూయువ కేంద్రం, వయోజన విద్యా కేంద్రాలకు గదులు ఉచితంగా ఇచ్చారు వారికి గదులు కావాలి కాని-అవరణశుభ్రత పట్టదు. వీరు కళాక్షేత్రంలో కూర్చుని ఏమిచేస్తుంటారో ఆ భగవంతునికే ఎరుక. ఒకటికి మూడు ఆఫీసులు కావడంవల్ల రాకపోకలపై నియంత్రణలేదు ఇది అవకాశంగా తీసుకొని కొందరు వ్యక్తులు తమ చీకటివ్యసనాలకు కళాక్షేత్రాన్ని వాడి, గబ్బుపట్టించేస్తున్నారట

ప్రజాధనంతో నిర్మితమైన ఇంతటి భూరిభవనం ఇట్లా దుర్వినియోగం కావడం బాగాలేదు. సంబంధిత అధికార్లు, కళాకారులు, కళాసంస్థలు క్షేత్రాన్ని సద్వినియోగం చేయడానికి మార్గాన్వేషణచేయడం అవసరం.

## లయన్స్ వైద్యశిబిరం

నెల్లూరు లయన్స్ క్లబ్ ఇటీవల గుడి

—కొరవ 8వ పేజీలో



## జైలునుంచి జనంలోకి

జయంపు కృష్ణ

కటకటాల తలుపు వెనుక
కిటకిటమను గుండెలరొద
పటపటమని తెంచుకుంటు
జైలునుంచి జనంలోకి
స్వేచ్ఛకోరు పవనంలోకి
ఓ నెల్సన్ మండేలా!
మా గుండెలు నిండేలా!
వచ్చావా! వచ్చావా!!
కొత్తకాంతి తెచ్చావా.
నీ కోసం ఎన్నినాళ్ళు
నీ కోసం ఎన్నికళ్ళు
విచ్చి పూచ్చి ఎదురుచూచి
అదనుకొరకు దారికాచె.
ఇన్నాళ్ళకు నీ విడుదల
కాంతినిచ్చె మా యెదలకు.
ప్రతియింట ఒకదీపం
మా కంటా నీ రూపం
స్వాగతం. సుస్వాగతం!
వదిలేద్దాం రోదగతం
మానవతే మనమతం
ఇక. మన.
అడుగే అప్రతిహతం.
రెక్కవిప్పె స్వాతంత్ర్యం
ఫలించె జాతి మనోరథం
విశ్వమంత నివాళితో
పలుకుతోంది స్వాగతం!

# సణుగుడు

★ ఎందుకీ మౌనపోరాటాలు?

★ నెల్లూరు క్లబ్‌లో చెప్పుల యుద్ధం!

డోలేంద్ర

మౌనపోరాటపు వార్తలు లేనిదే దినపత్రికలు విడుదల కావడంలేదు రిలే నిరాహారదీక్షలు, ధర్నాలు, ఘెరావ్‌లవలె అవీ మన దినచర్యలో భాగమైపోతున్నాయి. ఈ ఒంటరి యుద్ధానికి పట్టణం, పల్లె అనే భేదాకూడా కనిపించడంలేదు. వైవాహిక సంబంధాల విషయంలో తరతరాలుగా ఘనీభవించిన మౌనంవదలి,న్యాయం కోసం మన ఆడపడుచులు తిరుగుబాటుకు సాహసించడం వారిలో అంతటి ఆత్మవిశ్వాసం పెంపొందడం నిజంగా ఆశ్చర్యపడ వలసిన విషయమే; అభినందించదగిన సంగతికూడా!

మౌనపోరాటం సంస్కృతి వ్యాపించడానికి రామోజీరావు సినిమాకంటే, దినపత్రికల విస్తృత ప్రచారమే కారణమని చెప్పవచ్చు. ఎక్కడికైనా ఆడబడుచు తన జీవిత భాగస్వామికోసం వీధుల్లోకి వచ్చినా-ఆమె పోరాటాన్ని కథలు కథలుగాఅల్లి ప్రచారమిచ్చి, అధికారులలో ప్రజలలో కదలిక తెస్తున్నాయి పత్రికలు ఫోటోలు ప్రచురించి, ప్రకటనలుగుప్పించి మద్దతుప్రకటిస్తున్నాయి,అయితే ఆడపడచులవల్ల సానుభూతితో, ఈ కొత్తతరహా ఉద్యమంవల్ల ఆకర్షితులైన ఉత్సాహంతో దినపత్రికలు ఒక్కొక్కసారి విలువ ఇవ్వదగినదానికి మించి ప్రాధాన్యత నిస్తున్నాయేమోనన్పిస్తున్నది. పైగా ఈ సంఘటనలలో వార్తాప్రచారమే ఎక్కువగా కన్పడుతున్నది.

నెల్లూరులో జరిగిన ఒక మౌనపోరాటంలో ఆ ఆడపడుచు తనభర్తను వదిలేసి మూడేళ్ళపాటు బయటెక్కడోవుండిందట; తర్వాత మనసు మార్చుకుని అత్తింటికి రావాలని ప్రయత్నిస్తే. భర్త వద్దన్నాడని మౌనపోరాటం చేపట్టిందట. ఆత్మకూరు దగ్గర జరిగిన మరొక సంఘటనలోనూ సమస్య సారాంశం ఇంచుమించుగా ఇటువంటిదే!

భర్త అక్రమాలకు పాల్పడి, హింసించినందువల్ల భార్య ఇల్లువిడిచి పెట్టవలసిన పరిస్థితి వస్తే—తిరిగి తనభర్తలో పరివర్తనను, ఆతడి ఆశ్రయాన్ని కోరేహక్కు భార్యకు వుంటుంది. ఒత్తిడి తెచ్చిఅయినా ఆమె భర్తఇంటికి రావచ్చు. అయితే, వ్యక్తిగత కారణాలతో, తనపట్ల అయిష్టతతో ఇల్లువిడిచిపెట్టి, ఎక్కడెక్కడో తిరిగి వచ్చిన భార్యను ఉద్యమానికి భయపడి తిరిగి ఇంట్లోకి తెచ్చుకోవడం ఏ మగవాడికి తరమౌతుంది చెప్పండి, పైగా బలవంతపు విధానంతో జరిగే కలయిక ఎంతకాలం నిలుస్తుంది?

ఆధునికతపై ఎంతటి వ్యామోహం వుండినా-మన సమాజంలో వైవాహిక సంబంధాలు ఆ పాత సాంప్రదాయాను సారంగానే నడుస్తున్నాయనడం నిజం. భార్యాభర్తలమధ్య సంబంధమనేది కేవలం శారీరకావసరాలకు పరిమితమైనదికాదు;

—కొరవ 10 వ పేజీలో

# రఘుపతి అవార్డు ఈసారికి ఇంటూరికి ఇస్తారా?

దక్షిణభారత సినిమా సాంకేతికవర్గ సమితి, ఆంధ్రప్రదేశ్ ఫిలించేంబర్ ఆఫ్ కామర్స్, మద్రాసు తెలుగు ఫిలిమ్ ప్రొడ్యూసర్స్ కౌన్సిల్, మద్రాసు తెలుగు ఫిలిమ్ జర్నలిస్టుల సంఘం, దక్షిణభారత చలనచిత్ర కార్మికుల సమాఖ్య, ఇంకా చిత్రసీమలోని ప్రముఖులెందరో రఘుపతి వెంకయ్య అవార్డును స్వాతంత్ర్య సమరయోధుడు, పాత్రికేయుడు కళాప్రపూర్ణ ఇంటూరి వెంకటేశ్వరరావుకు ఇవ్వాలని చేసిన ప్రతిపాదనను మాజీ ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు పెడచెవిని పెట్టి, 'రవ' అభ్యున్నతికి దోహదం చేసినవారికే ఇచ్చినవిషయం అందరూ ఎరిగినదే.

అసలు ఇంటూరి చారిత్రక పరిశోధన ఫలితంగానే తెలుగు సినిమా పరిశ్రమకు రఘుపతి వెంకయ్య చలనచిత్ర పితృదేవులన్న విషయం తెలిసింది. ఇంటూరి కృషి వల్లనే మన రాష్ట్రప్రభుత్వం 1981 లో 'రఘుపతి వెంకయ్య' అవార్డును ప్రవేశపెట్టి, తెలుగు సినిమా పరిశ్రమ అభ్యుదయానికి విశిష్ట సేవను అందజేసిన వ్యక్తికి ఏటేటా ఇస్తోంది.

'స్వరాజ్య, కొంజాయి క్రానికల్' వగైరా అగ్ర దినపత్రికలకు పనిచేసిన ఇంటూరి తెలుగులో ప్రథమ ఫిలిమ్ మాస పత్రిక 'చిత్రకళ'కు సంపాదకత్వం వహించారు. 1945 లో మద్రాసు సినీ వర్కర్స్ యూనియన్ స్థాపించారు. కె.వి. గూడవల్లి రామబ్రహ్మం, టి. వి. గోపీచంద్‌ల వద్ద సహకార దర్శకులుగా పనిచేశారు. 'కథానాయిక మొల్ల' చిత్రకథ ఈయనదే. 82 ఏట ప్రవేశించినా ఇప్పటికీ ఎంతో ఉత్సాహంగా ఉద్యమాలలో పాల్గొనే ఇంటూరికి 'రఘుపతి వెంకయ్య అవార్డు' ఈ సంవత్సరమైనా దక్కాలని పలువురు చలనచిత్ర ప్రముఖులు ఆకాంక్షిస్తున్నారు.

**ఆ వృద్ధ యోధుణ్ని సత్కరించడం ప్రభుత్వ కర్తవ్యం!**

### "హోటల్ నవీన్"

విజయనిర్మల గృహం ఎదురుగావున్న డబ్బింగ్ థియేటర్‌ను హైదరాబాదుకు మార్చి, ఆ స్థానంలో వచ్చే ఉగాదినాటికి "హోటల్ నవీన్" ప్రారంభించనున్నారు. ఎ సి., టి వి., ఎస్. టి. డి. ఫోన్ సౌకర్యాలు ప్రతి గదిలో వుంటాయట. అత్యంతాధునికంగా ఆ హోటల్‌ను ఏర్పాటు చేయాలని విజయనిర్మల ఆశయం. విజయకృష్ణా మూవీస్ 18 వ చిత్రం "భారతమాత", ఇందులో విజయనిర్మలే టైటిల్ పాత్రను పోషిస్తుందని ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. ★

'కొత్తపెళ్ళికూతురా రా' లో రాధిక, రాజేంద్రప్రసాద్

# దర్శకులు తీసిందే చిత్రం కాదు- ప్రేక్షకులు కోరిందే చిత్రం!

'సినిమాలోదమ్ముంటే బాగాఆడుతుంది' ఇది తెలుగుచిత్రపరిశ్రమలో అందరినోట తరచు వినిపించేమాట. ఆ 'దమ్ము' కోసం మాస్ హీరో, హీరోయిన్ల డ్యూయెట్లు, బీభత్స పోరాటఫైట్లు, షరామామూలే. హింసాప్రవృత్తి, నేరాలు, జుగుప్స, అనవసర అంగప్రదర్శనలు దాదాపు ప్రతి చిత్రంలోనూ 'అనవసరం'గా విజృంభించాయి.

అయినా, థియేటర్‌లో సినిమాచూసి బయటకు వచ్చిన ప్రేక్షకుణ్ని 'ఎలా ఉంది సినిమా?' అని అడిగితే, 'ఫరవాలేదు,' అనేవారు. ప్రేక్షకుడినోట 'బాగుంది' అనిపించిన చిత్రాలు 'అంకుశం, గీతాంజలి, శివ' లాంటివి వేళ్ళమీదలెక్కపెట్టవచ్చు. ఇదివరకటిలాగా సినిమా అంటే 'హీరో' మాత్రమే అనేరోజులుపోయాయి. ప్రేక్షకుడి అభిరుచిస్థాయి పెరిగింది. చలనచిత్రాలకు అవసరమయ్యే ఉత్తమ ధోరణి, సత్సంప్రదాయ సిద్ధాంతం, కథాపరమైన మానవతావాదంతోపాటు సన్నివేశ రూపకల్పనలో అద్భుతమైన టెక్నిక్‌ను ఆశిస్తున్నారు ప్రేక్షకులు. అనవసరంగా సాగదీయకుండా, చెప్పేవిషయాన్ని సూటిగా చిత్రీకరించడాన్ని అభిలషిస్తున్నారు. చిన్న చిన్న లోపాలనుకూడా ఎత్తిచూపే పరిశీలనాశక్తి నేటి ప్రేక్షకులలో కనిపిస్తోంది. ఛాయాగ్రహణం, కూర్పు, సౌండ్ ఎఫెక్ట్స్ గురించికూడా ప్రేక్షకుడు చర్చించే స్థితికిఎదిగాడు. ప్రేక్షకులు మారారుగనుక ఇక దర్శక నిర్మాతలు మారవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఫార్ములా గిరను దాటకపోతే ఇక విజయాన్ని సాధించడం అంత తేలికకాదని గుర్తించాలి. ప్రేక్షకులు భరించలేని పరిస్థితి ఏర్పడకముందే కొత్త మార్గాలు అన్వేషించాలి. లేకపోతే ఇటువంటి చిత్రాలనుతీసి ప్రయోజనంలేదు.

## మద్రాసు సినిమా వార్తలు

### నెల్లూరు "నాయకురాలు"

నెల్లూరీయుడు కె. సత్యారెడ్డి ఎప్పుడూ బిజీగా ఉంటారు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో సినిమాస్కోప్‌లో డి. ప్రభాకర్ నిర్మించే "నాయకురాలు" చిత్రంలో శారద, సీత, భానుచందర్, ఆహుతి ప్రసాద్, రంగనాథ్, శ్రీధర్, నాగబాబు ఆదిగాగలవారు నటిస్తున్నారు.

### చిత్ర పరిశ్రమ డల్‌గా ఉంది

మద్రాసులో ఇప్పుడు చిత్రాల షూటింగులు బాగాతగ్గాయి. పెద్ద చిత్రాలు ఒకటీ అరా ఔట్‌డోర్‌లో షూటింగులు జరుపుకుంటున్నాయి. వాటిపరిస్థితి మొత్తంమీద అయోమయంగానేవుంది. జనవరినుంచి విడుదలైన చిత్రాలలో విజయవంతమైన వాటిని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. ఈఏడు తయారయ్యే చిత్రాల సంఖ్య బాగా తగ్గిపోవచ్చని అనుకుంటున్నారు. ఇదీ ఒకందుకు మంచిదేగా!

### ప్రకటన చిత్రాల్లో పారితోషికం లక్షలులక్షలు!

'గోద్రెజ్, సింథాల్' సోప్ వాడే ప్రకటన హ్రస్వచిత్రంలో పాల్గొన్నందుకు హిందీ నటుడు వినోద్‌ఖన్నా పుచ్చుకున్న పారితోషికం రెండులక్షలరూపాయలు. నేషనల్ పానసోనిక్ సంస్థ ప్రకటన చిత్రంలో కనిపించినందుకు మిథున్ చక్రవర్తి నాలుగులక్షలు వసూలు చేశారు. క్రియేటివ్ యూనిట్ తయారుచేసే

—తరువాత 11వ పేజీలో

## విద్యారణ్యంలోని క్రూరమృగాల దుర్మార్గాలపై సమరం

# ◂ నేటి చరిత్ర ▸

**చిత్ర సమీక్ష**

**గిద్దలూరు గోపాలరావు**

ఈనాటి మన స్వతంత్ర భారతంలో ప్రతివిషయమూ ఘనతవహించిన ఒక చరిత్ర అవుతుంది. ప్రతివిషయానికి విషపూరితమైన చరిత్ర సృష్టించటం స్వార్థపరుల బ్రతుకువిధానమవుతూవుంది. చరిత్రకు పనికొచ్చే అనేక విషయాల్లో, విద్యార్థులు, ఉపాధ్యాయులు, విద్యాబోధన పీఠమధ్య గాంధర్వాలు అన్న విషయాలను, నిర్మాత శ్రీమతి టి. శారదారెడ్డి దర్శకుడు ముత్యాల సుబ్బయ్య, ముఖ్యాంశాలుగా తీసుకొని 'నేటిచరిత్ర'గా చూపించారు.

అనాటి గురుకులంలోని చదువుకు ఈనాటి గురువనుకర్తే చదువులకు పోలికలు, తేడాలు చూపారు. అనాడు ఎంతటి మహారాజులైనా తమబిడ్డలను గురువుల దగ్గరకు తీసుకపోయి వినయ విధేయతలతో గురువుకు అప్పగించేవారు, శిష్యులు కూడా గురువుని దైవంగా చూచుకుంటూ భక్తిశ్రద్ధలతో విద్యనభ్యసించేవారు. ఈనాడు ఇది శూన్యం. అంతేకాకుండా ఆనాడు గురుకులాలు అడవుల్లో క్రూర మృగాల మధ్య వుండేవి. అయినా అవి విద్యార్థులకుగాని గురువులకుగాని హానికలిగించేవికావు. మరి ఈనాడు విద్యారంగాలు నగరాంలోవున్నా ఇందులో అడవిమృగాలనుమించిన క్రూర మృగాలున్నాయి. విద్యారంగాన్ని ఈ మృగాలు అవినీతిమయం చేస్తున్నాయి. కాలేజీ ప్రాంగణాన్ని రాజకీయరంగం చేస్తున్నాయి. గ్రూపులు తయారుచేసి పగా ప్రతీకారాలు పెంచుతున్నాయి. కక్ష సాధింపుతో సహవిద్యార్థులను హింసిస్తున్నాయి. విద్యార్థినులను మానసికవ్యథకు గురిచేస్తున్నాయి. గురువులను చిత్రహింసలపాలుచేస్తున్నాయి. సమ్మెలు, బంద్‌ల పేరున వ్యక్తిగత వైరం సాధిస్తున్నాయి. ప్రజాసంపదను సర్వనాశం చేస్తున్నాయి. వీటన్నిటినీ ప్రోత్సహించే పెద్దలున్నారు. చూస్తూవూరుకునే ప్రబుద్ధులున్నారు. చూసీ చూడనట్టుపోయే చట్టసభాదులున్నారు. విద్యార్థిదశలోవున్న తమ పిల్లల బాగోగులు చూచుకోని తల్లిదండ్రులు ఉన్నారు. ఈ విషయాలన్నీ పాతవే అయినా దర్శకుడు కొత్తజీవంతో ఆసక్తికరంగా చూపాడు.

చిత్రం అనాటి గురుకులంలోని పవిత్ర వాతావరణంతో ప్రారంభమవుతుంది. ఈనాటి విద్యాసంస్థల్లో స్థావరం ఏర్పరచుకున్న భయంకర విభాగంలోకి ప్రవేశిస్తుంది. విద్యార్థులలో మార్పుతెచ్చి ముగుస్తుంది.

ఈ చరిత్రకు సూత్రధారుడు వినయ్. ఇతను పార్లమెంటు మెంబరూ, కాలేజీ కమిటీ అధ్యక్షుడూ అయిన వల్లభరావు (గొల్లపూడి) కుమారుడు. తండ్రి ప్రోత్సాహంతో కాలేజీలో వినయ్ చెయ్యని దుండగాలు లేవు. విద్యాసాగర్ (సుమన్) అనే యువలెక్చరర్ విద్యార్థుల్లో మార్పు తెస్తాడు.

విద్యార్థుల సమ్మె కాలంలో ఏడుకొండలు అనే విద్యార్థి తన తల్లిదండ్రులు ప్రయాణిస్తున్న బస్సునే తగలబెట్టడం, అందులో తల్లి దహనమైపోవటం, ఇది తెలుసుకున్న ఏడుకొండలు, జాతీయపతాకం కట్టివున్న

—తరువాత 11 వ పేజీలో

# జిల్లావార్తలు

(5 వ పేజీ తరువాయి)

రంగాలన్నింటి అధికార్ల సహకల్పం. మరొక కండేళ్ళలోపల పూర్తి చేయడం. కెనైనింగ్ అర్థిక సహాకారం తదితర పిర్యాబ్లు పూర్తి చేసుకోవలసి వుంటుందని అధికారులు అభిప్రాయ పడుతున్నారు. దీనికి 1700కోట్ల రూపాయల పెట్టుబడి అవసరమౌతుందని అంచనా.

ఒరిస్సాలోని తాల్చేర్ గనులనుంచి సముద్రమార్గాన, రైళ్ళ ద్వారా గాని బొగ్గును రవాణా చేయాల్సి వుంటుంది. సముద్రమార్గమైతే కృష్ణపట్నం రేవును సిద్ధం చేయాల్సి వుంటుంది; రైళ్ళద్వారా రవాణాకు నిర్ణయిస్తే నెల్లూరునుంచి కృష్ణపట్నం వరకు రైల్వేలైను నిర్మించవలసి వస్తుంది. రోడ్డుకూడా భారీవాహనాల రాకపోకలకు అనువుగా విస్తరించాలి. కాని కృష్ణపట్నం రేవు అభివృద్ధిపరిస్తే అది థర్మల్ స్టేషన్ బొగ్గుసరఫరాకే సరిపోతుందని, థర్మల్ స్టేషన్‌కు అనుబంధంగా కృష్ణపట్నంరేవు అవసరమని శ్రీ శంకర్ పెరిబర్నార్డు థర్మల్ స్టేషన్ నిర్మాణాలకు ఒక టి ఎం సి నీరు కావాలట. సోమశిల రిజర్వాయర్ నుంచి నెల్లూరు చెరువుకు మళ్ళించి, కృష్ణపట్నం కాలువను ఆధునికీకరించడంద్వారా అవసరమైన సరఫరా చేయవచ్చునన్నది ఒక ప్రతిపాదన. కండ్లేరు రిజర్వాయర్ నుంచి పైపులైను ద్వారా నీళ్ళుతెచ్చే అవకాశాన్ని పరిశీలిస్తున్నారు. ఎమ్మెల్యే శ్రీ సి వి శేషారెడ్డి బోర్డు ఛైర్మన్‌కు ప్రత్యేక వినతి పత్రం సమర్పించారు.

### కావలి జేసీస్ కార్యవర్గం

కావలి జూనియర్ ఛాంబర్ క్లబ్‌కు కొత్త కార్యవర్గం ఎంపికైంది. అధ్యక్షుడుగా శ్రీ ఎం. వి. మనోహరరావు, కార్యదర్శిగా శ్రీ పి. రవికుమార్, కోశాధికారిగా శ్రీ డి. జయచంద్ర ఎన్నికైనారు. క్లబ్ తరఫున రాజావారి చింతలపాలెం, దగదర్తి గ్రామాలలో బస్‌షెల్టర్లు నిర్మిస్తామని అధ్యక్షులు ప్రకటించారు. రాష్ట్రస్థాయిలో కావలిక్లబ్‌కు 4 సేవాఅవార్డులు లభించాయి.

### కోర్టుకెక్కిన గూడూరు డి ఎస్ ఆర్ కమ్యూనిటీ హాలు

గూడూరు డి ఎస్ ఆర్ కమ్యూనిటీ హాలు కోర్టుకెక్కింది. వదాన్యుల విరాళంతో నిర్మించబడిన ఈ సామూహిక భవనంలో ఒకగదిని గూడూరు సంస్కృతీ సమ్మేళనానికి సంగీత నృత్య పాఠాల నిర్వహించడానికి కేటాయించారు. ఈగదికి దాత శ్రీ పొన్నలూరు వీరరాఘవరెడ్డి. 20 వేల విరాళమిచ్చి కట్టించారాయన. నవేరా శ్యామసుందరరెడ్డిగారి నిర్వహణలో వున్న డి. ఎస్. ఆర్. కమ్యూనిటీహాలు కమిటీ, ఈ గదికి, ఆవరణ లోపల నిర్మించనున్న మరికొన్ని వసతిగృహాలకు కలిపి ఘనమైన ప్రారంభోత్సవ కార్యక్రమం జరిపించాలని తలపెట్టిందట

ఈలోగా సంస్కృతీ సమ్మేళనం అధ్యక్షుడు శ్రీ గుర్రేటి అబ్బయ్య, ఆ గదికి ప్రారంభోత్సవం చేస్తున్నట్లు పత్రికలో రాసు; సబ్‌కలెక్టర్‌నుకూడా పిలిచారు; ఆహ్వాన పత్రికలు అచ్చయిన తర్వాత హాలు కమిటీకి ఈ సంగతి తెలిసి సబ్‌కలెక్టరు గారిని కలిసి ఇది తమకు తెలియకుండా తమ ఆవరణంలో జరుపుతున్న సభ అని విన్నవించారట ఈ వివాదంలో తన ప్రమేయ మెందుకని సబ్‌కలెక్టర్ సభకు రాలేదు. గుర్రేటి అబ్బయ్య మాత్రం కమిటీ అభ్యంతర పెడుతుందనే భయంతో గూడూరు కోర్టులో ఇంజక్షన్ ఆర్డర్ తెచ్చి, పోలీసు బందోబస్తుతో ఆ గదికి ప్రారంభోత్సవ శిలాఫలకం తగిలించారు.

ఒంటె గుడారం సామెతలాగా వుంది ఈ సంఘటన. పుణ్యానికిపోయి కమిటీ గదిని ఇవ్వడమేమిటి, కమిటీనే ప్రక్కకు నెట్టే యత్నం చేయడమేమిటి; సంస్కృతీ సమ్మేళనం చేసింది పొరపాటు; క్షమాపణలు చెప్పి. తప్పును సరిదిద్దుకోండి!

### గూడూరు రోటరీ శిబిరంలో 120 మందికి ఆపరేషన్లు

గూడూరు రోటరీక్లబ్ జటీపలం ప్రభుత్వాస్పత్రిలో ఉచిత నేత్ర వైద్యశిబిరం నిర్వహించింది. పోట్లపూడి సర్పంచ్ శ్రీ చిల్లకూరు సుధీర్‌రెడ్డి కుమారుడు, మైపాడు సముద్రతీరంలో అకాల మృత్యువాతపడిన దురదృష్టవంతుడు చిల్లకూరు శ్యామసుందరరెడ్డి జ్ఞాపకార్థం ఈ శిబిరం నిర్వహించారు. డాక్టర్ కృష్ణారెడ్డి, డాక్టర్ సైదారావు, డాక్టర్ నరసింహులు 800 మంది రోగులను పరీక్షించి, 120 మందికి ఆపరేషన్లు చేశారు. వారందరికీ అలపాటు వారికి వసతి భోజనం ఉచితంగా కల్పించారు; కళ్ళద్దాలుకూడా పంచిపెట్టారు. టౌను కాంగ్రెస్, తెలుగుదేశం నాయకులైనప్పటికీ, శ్రీ ఎల్లు పిరి గోపాలరెడ్డి, శ్రీ మహంకాళి శ్రీరామమూర్తి క్లబ్ నిర్వహణలో మాత్రం రాజకీయ కక్షలు మర్చిపోయి రాత్రింబవళ్ళు పనిచేస్తున్నారు. వారిద్దరికీ రోగులు చేతులెత్తి దండం పెడుతున్నారు!

ఈ సందర్భంగా జరిగిన సభలో సబ్‌కలెక్టర్ శ్రీ సతీష్‌చంద్ర, డాక్టర్ సి. జనార్దనరెడ్డి, డాక్టర్ సి. ఆర్. రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

*

### తెలుగుగంగ

(6 వ పేజీ తరువాయి)

అంతా బయటి ప్రాంతాలనుంచి వచ్చిన వ్యాపారస్తులు కనిపెట్టిన దోపిడీ మార్గం తప్ప, రైతులకు సంబంధంలేదని ఎమ్మెల్యే తెలియజేశారు.

పైగా ఈ దానిమ్మతోటలు అధికభాగం అసైన్‌మెంట్ పొలాలలో సాగుచేస్తున్నారట. అసైన్‌మెంట్ పొలాలు అమ్మకానికి పనికిరావు. నష్టపరిహారం చెక్కులుకూడా అభూమి కల్గిన పేదల పేరుతోనే వస్తాయి. అయినా మాటలచెప్పిందం కుదుర్చుకుని సాహసించి తోటలు పెంచుతున్నారట.

★

### పెండ్లిండ్లు

(10వ పేజీ తరువాయి)

31 తేది నెల్లూరు పాండురంగ కళ్యాణ నిలయంలో జరిగింది.

• • •

నెల్లూరు న్యాయవాది శ్రీ మేడిరెడ్డి రఘురాం పుత్రిక మాధవి; సూళ్లూరుపేట శ్రీ కే. ఎస్. వెంకటేశంనాయుడు కుమారుడు మస్తాన్ వివాహం 31 తేది నెల్లూరు టి.టి. డి. లో జరిగింది.

• • •

నిడిగుంటపాలెం శ్రీ. కే. చెన్నారెడ్డి రఘురామరెడ్డిగారి కుమారుడు మనోహర రెడ్డి; ముత్తుకూరు, శ్రీ అల్లూరు వెంకట రమణారెడ్డి కుమార్తె ఉష వివాహం 31 తేది రంగనాయకులపేట శ్రీ రాఘవ కళ్యాణ మండపంలో జరిగింది.

• • •

కోట - వెంకన్నపాలెంవాసి, స్నేహ సౌమ్యశీలి డాక్టర్ పాటూరు వెంకటరామన్ మనుమడు. శ్రీ పి. సుబ్రహ్మణ్యం కుమారుడు విజయరాఘవరాం; గునపాడు, శ్రీ అల్లాడి కృష్ణమూర్తి కుమార్తె శైలజ వివాహం 31 తేదీ నెల్లూరు అంధ్రసభ భవనంలో జరిగింది.

• • •

ఎటువంటిఅననుకూల పరిస్థితులలోనైనా సర్వప్రియంగా నేర్పుగా ఓర్పుగా విజయవంతంగా పనిచేసుకొనిపోగల సమర్థుడు, అధికార దేపజంలేని సౌమ్యుడు, మన కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకి జనరల్ మేనేజరుగా పనిచేసి, ఇటీవలలో కడప కృష్ణజిల్లా బ్యాంకు మేనేజరుగా మచిలీపట్నంలో తేలివున్న నెల్లూరీయుడు శ్రీ ఎం వి. కృష్ణారెడ్డి తనయ అంబికమన కి. శే. పి. వి. సుబ్బారెడ్డిగారి పౌత్రి సుప్రియ; సూళ్ళూరుపేట - శ్రీ పి. వి. రాఘవరెడ్డి తనయుడు మధుసూదనరెడ్డి వివాహం 31 తేది విజయవాడ బెంజ్ సెంటరులోని ఎస్. వి. ఎస్. కళ్యాణ మండపంలో జరిగింది.

• • •

తనకు పట్టుకున్న విన్నాళ్ళ తనివి నెల్లూరులోనే వదలి, మద్రాసులోని రామకృష్ణ మఠం స్వాముల సాహచర్యంతో వేదాంతలోకంలో కాలాన్ని ప్రశాంతంగా, గౌరవప్రదంగా, సార్థకంగా గడుపుతున్న మిత్రుడు శ్రీ కాకాణి రమణారెడ్డి తమ్ముడు కి శే కృష్ణారెడ్డి కుమారుడు, మద్రాసు హోటల్ నాగార్జున అధిపతి, యోగ్యుడైన యువకుడు నరహరి;నెల్లూరు-శ్రీచిల్లకూరు వెంకురెడ్డి కుమార్తె విజయగౌరి వివాహం ఫిబ్రవరి 1 తేది నెల్లూరు ఇందిరాభవనలో జరిగింది.

• • •

జుబ్బమిత్రుడు శ్రీ ఇప్పగుంట రామచంద్రారెడ్డి కుమారుడు శరత్‌కుమార్; రేబాల - శ్రీ నాయుడు శ్రీనివాసులురెడ్డి కుమార్తె విలాసిని వివాహం 1 తేది నెల్లూరు టవున్‌హాలులో జరిగింది.

• • •

మినగల్లు-శ్రీ ముక్కర రామసుబ్బానాయుడు కుమారుడు వణీంద్రబాబు; రాచమేడు-శ్రీ కాల్వ గోపాలనాయుడు కుమార్తె వాణి వివాహం 1 తేది గూడూరు దువ్వూరు రమణమ్మ మహిళా కళాశాలలో జరిగింది.

★



## అశ్రుతర్పణం

జననం : 1-7-53 మరణం : 7-2-90

నిరంతరం మా హృదయాలలో నిలిచిపోయిన

### చెంబేటి నరసింహులుగారు

(వరుగుపాడు సింగిల్‌విండో డైరెక్టర్)

అకాలమరణం మమ్మల్నెంతో తల్లడిల్లజేసింది.

వారికి శ్రద్ధాంజలిఘటిస్తూ

**కర్మక్రతువులు 21-2-90 తేది**

స్వగృహంలో (సిద్ధాశ్రమంరోడ్డు. వరుగుపాడు, కోవూరు) జరుప బడును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

చెంబేటి లక్ష్మీనరసయ్య, శేషమ్మ - తల్లి దండ్రులు

చెంబేటి భాగ్యలక్ష్మి —భార్య

చెంబేటి పెదపెంచలయ్య, చినపెంచలయ్య చిన్నయ్య

సోదరులు

జయలక్ష్మి, జలజ, మంజుల -మరదళ్ళు

పనుపులేటి విజయలక్ష్మి, యానాదయ్య -చెల్లెలు, బావ

పిచ్చురు రమణయ్య (మండల అధ్యక్షుడు-కోవూరు)